Regd No. N. 45 / M. 3813

వెల ఒక అణా

102 878

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ర ఫాల్గుణ శు॥ ౫ (౩౦-౫-౧౩౫౦ ఫ.) సోమవారము సంచిక ౨౩

తుర్కీలో బ్రిటిషు మంత్రి ఆలోచన ★

★ బల్గేరియాలో జర్మను సైనికులు ★

# జపానుకు ఇండోచైనా లొంగుటు

## బాల్కను ప్రాంతంలో బ్రిటీషు మంత్రి ఆలోచనలు

### రష్యా జపానులకు ఒడంబడిక

బాల్కన్ పరిస్థితులు

బల్గేరియాలోకి రుమేనియానుండి జర్మను సేనలుకొన్ని ప్రవేశించినట్లు కొందరుచెప్పుచున్నారు. ఫిబ్రవరి ౨౬వ తేదీన బ్రిటిషు పార్లమెంటు కామన్సు సభసమావేశంలో బ్రిటిషుప్రభుత్వ విదేశాంగశాఖకార్యదర్శి బట్లరు గారు రుమేనియానుండి బల్గేరియాలోకి జర్మను సేనప్రవేశించుటకు సర్వసిద్ధముగానున్నట్లు తెలిపిరి- తుర్కీ ప్రభుత్వమువారు బల్గేరియా ప్రభుత్వముతో గావించుకొన్న ఒడంబడికవల్ల బ్రిటను-తుర్కీల ఒడంబడికకు భంగము గానిరలుగదనియు, బ్రిటనుయెడ తుర్కీవారు నెరవేర్చవలసిన ధర్మములను నెరవేర్చుటకు అటంకముండజాలదనియు, తుర్కీ విదేశాంగమంత్రియగు సారజోగ్లుగారు ఫిబ్రవరి ౨౮వ తేదీన ఒకపత్రికాప్రతినిధికి విశదపరచిరి- మరియు తుర్కీ క్షేమమునకు ముఖ్యమైనప్రదేశములోగాని జర్మనులుగాని, ఇతరులుగాని తమ యిష్టమువచ్చినట్లుచేయుటకు తుర్కీ సహించదనియు అట్టిదిజరుగుచో సేనలతో ప్రతిఘటింపగలదనియు సారజోగ్లుగారు స్పష్టము చేసిరి- బల్గేరియా సేనలు తుర్కీ సరిహద్దుపైపునను, గ్రీసు సరిహద్దు వైపునను ఉంచబడినవి- తుర్కీ సరిహద్దువెంబడినుండు బల్గేరియా సేనకుతోడుగా కొంత జర్మసేనకూడయుంచబడినట్లు చెప్పుచున్నారు- బల్గేరియా గుండా జర్మను సేనలను గ్రీసుపైకిదండెత్తనిచ్చుట తుర్కీ- బల్గేరియాల ఒడంబడికకు విరుద్ధమని తుర్కీలో ఒకప్రసిద్ధుడైన పత్రికాసంపాదకుడు వివరించినాడు- అమెరికాసంయుక్తరాష్ట్ర రాజధానినగరమగు వాషింగ్టనులోని తుర్కీ రాయబారి ఫిబ్రవరి ౨౭వ తేదీన అమెరికా సంయుక్తరాజ్య ప్రభుత్వపు విదేశాంగశాఖ సహాయమంత్రియగు సమ్నర్ వెల్సు గారినిదర్శించి తుర్కీ బల్గేరియాఒడంబడికయొక్క అంతరార్థమును విశదీకరించి తుర్కీ బ్రిటనుయెడ తనబాధ్యతలను వదలుకొనినదని తలచరాదని నచ్చజెప్పిరి- తుర్కీ బ్రిటనుల ఒడంబడికను తుర్కీ ఇపుడు ఆచరణలో అనుసరించుచున్న విధముచాల సంతృప్తికరముగానున్నదని బ్రిటిషు ప్రభుత్వవిదేశాంగశాఖ కార్యదర్శి బట్లరుగారు బ్రిటిషుపార్లమెంటు కామన్సు సమావేశంలో ఫిబ్రవరి ౨౬వ తేదీనప్రకటించిరి. ఇందువల్ల తుర్కీ బల్గేరియాలఒడంబడిక కొందరుచెప్పుచున్నట్లు జర్మనీకి అనుకూలముగాక బ్రిటనుకే అనుకూలమనితలచవలసియుండును అయితే "జర్మను సైన్యము బల్గేరియా ప్రవేశించినపుడు బల్గేరియా ఎదురొడ్డకుండ ఊరకొన్నచో బ్రిటనుఆదేశమునుశత్రుదేశముగా భావించునని ఏల తెల్పరాదు" అని ఒక సభ్యుడడిగినప్రశ్నకు బట్లరుగారుమౌనము వహించుట అనుమానమునకెడమిచ్చుచున్నది. కానితుర్కీ బల్గేరియాలఒడంబడిక తుర్కీ బ్రిటనుల ఒడంబడికకు అడ్డురాదని వారుస్పష్టముగాచెప్పినారు.అయితే బల్గేరియాలోని బ్రిటిషు రాయబారియగు రెండల్ గారు ఫిబ్రవరి ౨౬వ తేదీన పత్రికలవిలేఖకులతో సంభాషించుచు బల్గేరియాపూర్తిగా జర్మనీకి వశమై బ్రిటనుయొక్క మిత్రదేశములపై యుద్ధము సాగించబడుటకు కేంద్రస్థానముగఉపయోగించుకొనబడుచో బ్రిటను బల్గేరియాతో మైత్రి తెగతెంపుచేసికొనక తప్పదనిచెప్పిరి. ఇప్పటికైతే బల్గేరియాలో పోలీసులు, పత్రికలు జర్మను అధికారుల కనుసన్నలలో మెలగుచున్నవని వారు చెప్పిరి.

బ్రిటిషు విదేశాంగమంత్రియగు ఈడెన్ గారు బ్రిటిషు సర్వసైన్యాధిపతియగు సర్ జాన్ డిల్ గారితోకలిసివిమానాలో తుర్కీకి ఫిబ్రవరి ౨౬వ తేదినాడుచేరిరి. ౨౭వ తేదినాడు తుర్కీ ప్రధాననగరముగుఅంకారాకుచేరి మరునాడుతుర్కీ ప్రధానితోను విదేశాంగమంత్రితోను మాట్లాడిరి. మధ్యధరాసముద్రపరిస్థితులను గురించియు, బాల్కను ప్రాంతపరిస్థితులను గురించియు చర్చించియుందురని ఊహించవచ్చును. ఈసంభాషణల ఫలితంగా తుర్కీ బ్రిటను ప్రతినిధుల కేకాభిప్రాయంకుదిరినదని సంగతి నెరిగినవారలు చెప్పుచున్నారు. తుర్కీలో ఈడెనుగారు రష్యాలోని బ్రిటిషురాయబారియగు సర్ స్టాఫర్డు క్రిప్సు గారితో బాల్కను ప్రాంతపరిస్థితియెడ రష్యావారి వైఖరినిగురించి తెలుసుకొనదగినదానినంతయు తెలిసికొనదలచినారు తుర్కీలోనుండే రష్యా, యుగోస్లావియా, బల్గేరియాల రాయబారులతో ఈడెన్ గారు ౨౮వ తేదిన సంభాషించిరి. ఈడెన్ గారితో సంభాషించుటకై క్రిప్సు గారివలెనే బల్గేరియా, యుగోస్లావియా, హంగెరీలలోని బ్రిటిషురాయబారులు కూడ తుర్కీ కిరావచ్చునని తెలియుచున్నది-

రుమేనియాలోకి జర్మనువిమానములు ౬౦౦ క్రొత్తగావచ్చిచేరినట్లు తెలియుచున్నది, రుమేనియాదేశమందంతటను ఆంటొనెస్కూ గారి పరిపాలనకావలెనావలదాఅను సమస్యను తేల్చుటకై ఎన్నికలు మార్చినెల ౨వ తేదినాటికేర్పాటుచేయబడినవి. ఈఎన్నికలు జర్మనీలోజరుపబడినట్టి ఎన్నికలవలెనె జరుగునని చెప్పబడిన. రుమేనియాపోలీసువారు లెగన్ గార్డుపార్టీ నాయకుడగు కార్మిలా గారిని కాన్స్టాంటినోపుల్ పట్టణంలో అరెస్టుచేసినట్లు వార్తవచ్చినది రుమేనియాతో ఆస్ట్రేలియా ప్రభుత్వము వర్తకసంబంధమును తెగతెంపుచేసికొన్నది. రుమేనియా రష్యాలకుకీవర్తక పుఒడంబడిక కుదిరినది. రుమేనియాలోని కొన్ని రష్యాకు తిరిగి వెనుకకిప్పించుటకొరకు ఈఒడంబడిక చేసికొనబడినది.

యుగోస్లావియా, హంగెరీలకుదిరిగ ఒడంబడికవల్లవాటితగాదాలన్నియు తీరిపోయినట్లు భావించుచున్నారు అందువల్లఆవొడంబడికకుసంబంధించిన కొన్నిపత్రములపై సంతకముచేయుటకు యుగోస్లావియా విదేశాంగమంత్రి మార్కొవిచ్ గారు హంగెరీకి ఫిబ్రవరి ౨౭వ తేదిన ప్రయాణమైపోయిరి.

బోస్ఫరసులో పెట్రోలునిలువలు పెట్రోలుతోను పారుషినుతోనునిండినఓడలు తగులబడినట్లు ఇటాలీయులనుచున్నారు. ఇది గూఢచారుల గు శత్రువుల చర్యలై యుండవచ్చునని అనుమానముగానున్నది

దక్షిణాసియాపై యాత్రకు జపానుసన్నాహములు

జపానువారు దక్షిణాసియాలో రాజ్యముల ఆక్రమణకు అన్నిరకముల సన్నాహములను పూర్తిచేసినట్లు వార్తలువచ్చినవి. జపానువారు మొదట అమెరికాను బెదరించు ప్రకటనలను చేసి

(౨వ పేజిచూడుడు)

# కర్ణజనన వివాదము

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

కర్ణజననముంగూర్చి నేనేదియొ తప్పువ్రాసితి నని యాంధ్రలోకమున నిటీవల వాదుకబయలుదేఱినది. అందు శ్రీబులుసు వేంకటేశ్వరులు బి ఏ గారివ్రాఁత ముఖ్యమైయున్నది. నాసమాధాన మునింతకుముందే వ్రాసియున్నాను. మఱియు నిప్పటి యాంధ్రమహాశయులకు మఱియొకమారు విశదీకరించుచున్నాను. దీనిపై వచ్చువివాదముల కుఁ బ్రత్యుత్తరము నీయఁగలను.

కర్ణజన్మముఁ గూర్చి ఆదివనపర్వములలో స ద్యోగర్భవిరుద్ధముగా వర్ణింపఁబడియున్నదని నేను వ్రాసినందులకు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు "మహాభారత చరిత్రనిరాకరణము"న ౨౫, ౨౬ పుటలలో సంస్కృతవనపర్వమునఁ గర్ణుఁడు సద్యోగర్భజనితుఁడుగా నుండఁగా నెట్టప్రగడ భారతమును, పండితమాన్యులు సంస్కరించిరి. అట్లా పండితమాన్యులు సంస్కరించుటకు సంస్కృతమున, శ్లో. తతోగర్భస్సమభవ త్పృథా యాః పృథివీపతే। శుక్లేదశోత్తరేపక్షే తారాప తిరివాంబరే। సాబాంధవభయాద్బాలా గర్భం తంవినిగూహతీ"

అను శ్లోకములలోని దశోత్తరశబ్దము ప్రమా దముగ లిఖించుటచేత పండితంమన్యులు పొరఁబడిరని యేమేమోవ్రాసి పైశ్లోకములకు నీలకంఠవ్యాఖ్యానము నీక్రిందిరీతినివ్రాసిరి.

"తతఇతి దశోత్తరే ఏకాదశే శుక్లపక్షే ప్రతిపదిచంద్ర ఇవబాలఉద్భూతః మాఘశుక్లప్రతిపది కర్ణనిషేకజన్మేత్యర్థః" అనుయున్నది. దీనింబట్టి విచారింప మాఘశుక్లప్రతిపద్దినంబునఁ గుంతిగూడెవసియు. నానాఁడే గర్భమయ్యెనని యుం, నానాఁడే కర్ణుఁడు పుట్టెననియు స్పష్టపడుచున్నది"

మఱియునీయంశము తను శ్రీకృష్ణభారతార ణ్యపర్వమున విశదీకరించితిమనియు, దానింజూచి నవారికి విశేషాంశములు బోధపడుననియువ్రాసిరి.

నేను శ్రీపిఠాపురమహారాజావారి యానతిని, ఆంధ్రదేశములోఁ బదుమూఁడు మండలములనుండి యాంధ్రభారతప్రతులను సేకరించితిని. అవ్రాఁతప్రతులు మూఁడువందలేండ్లనుండి నేఁటికేఁబదియేండ్లకుఁబూర్వమువరకును వ్రాయబడినవి. అప్రతులన్నిటియందును నేఁడు ముద్రణమువందున్నరీతిని కుంతిపదినెలలు మోసికనినట్లేయున్నది. అయిన నేండ్లనుండి పెక్కుతడవలు ముద్రణమగుచున్న నానావిధములగు భారతపుఁబ్రతులలోను అట్లేయున్నది. ఆలోచింప, వ్రాసిన, ముద్రించినవీరందఱును ఖండితంమన్యులేయగుదురా! లేక శంభుదాసమహాశయిరియే పండితంమన్యుఁడా? కాని శాస్త్రిగారుదాహరించిన నీలకంఠవ్యాఖ్యలో "మాఘశుక్లప్రతిపది కర్ణనిషేకజన్మేత్యర్థః" అనియున్నదిగాని జన్మమనిలేదు. నిషేకజన్మమనగా మునజీవుడు వీర్యముద్వారా ప్రవేశించుట. దీఁగూర్చి, "లఘుజాతక, బృహజ్జాతక, సారావళి" జ్యోతిశ్శాస్త్రగ్రంథములు, భట్టోత్పల వ్యాఖ్యాతలువిశేషముగాఁ జర్చించియున్నాఁరు బృహజ్జాతకమున నిషేకజన్మమును, జన్మః (భూమియందు జన్మించుట)ను బురస్కరించి యములుచెప్పఁబడియున్నవి. మఱియు శాస్త్రి రుదాహరించిన శ్లోకములలోఁగాని వ్యాఖ్యములోఁగాని నిషేకజన్మమనియే కాని, జన్మమనలేదు, వారుదాహరించిన శ్లోకవ్యాఖ్యలో మాఘశుక్లప్రతిపత్తునఁజన్మమనిచలే నుద్భవించెననుటఁ జూచి, ప్రతిపత్తునందు, ఆకాశమునఁ జంద్రుఁడుద్భూతుఁడైనట్లును నుపమానము చంద్రునియొక్కకళఁ గాఁడుద్భవించి ప్రజలకుఁ గాన్పింపనిరీతిం గర్ణుఁడు గర్భమునమాత్రమె ప్రవేశించెననునర్థమగుచున్నది కాని శాస్త్రిగారు రెంపవశ్లోకార్థము తాత్పర్యముకాకకాఁబోలు వ్రాయులేదు. "తంగర్భంవినిగూహతీ=ఆగర్భమును దాఁచుచున్నదై" క్రియరదేది? తరువాతంగల శ్లోకార్థమును నిర్ధుష్టగల శ్లోకములనుజూచిన శాస్త్రిగారితప్పు...

శ్లో. భారియామాసగర్భంసా.... నచైనాంబుబుధే జనః। నహితాం వేద నార్యన్యా కాచిద్ధాత్రేయికాముతే। కన్యాపురగతాంబాలాం నిపుణాం పరిరక్షతీ। తతఃకాలేన సాగర్భం సుషువేవరవర్ణినీ

"కుంతిగర్భమును రహస్యము గాధరించెను. ఈ గర్భముసుధరించినకుంతిని ఇతరపురుషుఁడు గాని, యువ్వస్త్రీగాని యామెనే.... రక్షింపఁబడుచు నుటచే నెఱుఁగరు. ఒక్క దానికిమాత్రమె తెలియును. పిమ్మట సకాలముచేతనే యామెకుం బిడ్డముగనెను." శాస్త్రిగారుతరువాత శ్లోకములనువదలి కవిత్రయములోనొకఁడగు శంభుదాసుమహాకవిని పండితంమన్యునిగాఁజెప్పుట సుదతప్పు. మఱియు పైశ్లోకములకర్థముకొక తామెఱెం గోత్రయంశముఁ గనిపెట్టినట్లుతమ కృష్ణ

భారతపుటరణ్యపర్వమున "పుట్టోఁటుప్పు"వనీయుంశముప్రాయుట యంతకంటెతప్పు

ఇట్లని ౧౯౩౩సం౹౹మునఁ బ్రకటించిన నా మహాభాగతచరిత్రముయొక్క ద్వితీయముద్రణమున ౫౪,౫౫,౫౬, పుటలలో కృష్ణమూర్తిశాస్త్రిగారివ్రాఁతను ఖండించితిని. దీనిశెఱుంగనికాఁబోలు శ్రీయుత బులుసు వేంకటేశ్వరులు, బి,ఏ గారు నావ్రాఁతను ఖండింపుచు కృష్ణమూర్తిశాస్త్రిగారి యొక్క తప్పుడువ్రాతను బలపఱచుచు ౨౨-౧౧-౧౯౪౦ సం౹౹ ఆంధ్రపత్రిక సారస్వతానుబంధమున వ్రాసిరి. కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసినవ్రాతలో "తతోగర్భస్సమభవతు పృథాయాః పృథివీపతే......తతఃకాలేనసా గర్భంసుషువేవరవర్ణినీ" పైశ్లోకములలోని "తతఃతతః" అని రెండుపర్యాయములు చెప్పుటలోఁగలస్వారస్యమును సంస్కృతజ్ఞానముకలవారు గ్రహింపఁగలరు. 'కాలేన' అనుతృతీయావిభక్తికిసప్తమీవిభక్త్యర్థము కలుగుటను గూర్చి వైయాకరణులు విశదీకరింపగలరు. కృష్ణమూర్తిశాస్త్రిగారు తామువ్రాసిన దితప్పని తెలిసికొనియుండికాఁబోలు ౧౯౩౯ సం౹౹ మెయినెలలో 'అన్నవరము'లో జరిగినసభకుబోయియుండినపుడు తమవ్రాతనుబలపఱచుడని బ్ర౹౹శ్రీ౹౹ ఇంద్రకంటి సూర్యనారాయణగారిని(వీరవరము)కోరియుండిరి. సూర్యనారాయణగారికదితప్పనితోఁచుటచే నేన్ప్ర....యనని చెప్పియున్నారట. కాని నేటికి శ్రీబులుసువేంకటేశ్వర్లుగారుదానిని బలపరచుటతటస్థించినది. వేంకటేశ్వర్లుగారు వ్రాసినవ్రాతలో మరియొకతప్పునుగలదు, ఆదేదన, సద్యోగర్భవిషయము వారందులకు జెప్పిన ధాన్యమాలిని గర్భమునుగుఱించి వ్రాసిన వ్రాతమాలకము. సంస్కృత రామాయణమున హనుమంతుడు మొసలిగర్భమునుబొచ్చుట, యామొసలి శాపవిముక్తయగుట, యదిధాన్యమాలినియగుట, యనుకథలేలేవు. మఱియొకవిచిత్రమేమన, సంస్కృతాంధ్ర రామాయణములయందు సుందరకాండములో హనుమంతుడు సీతను జూచుటకుబోయినసందర్భమున గోసముతో రావణుడుసీతనుగొట్టబోగా వానినడ్డుకొనినదిధాన్యమాలినియే. ఇంచుమించు పదునైదుదినములలో నాధాన్యమాలిని యెట్లుశాపమునొందెను? ఎప్పుడతికాయుడుపుట్టెను? ఇదియసందర్భముకాదా? నేచెపేవాదు. ఈకర్ణజన్మమునుగురించి యిటీవల 'శ్రీమదాంధ్రమహాభారత సంశయవిచ్ఛేద'మను

గ్రంథమున (౧౯౩౯ సం) శ్రీవఝ్ఝసూర్యనారాయణగారు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిపేరును జేర్కొనుచు విపులముగా పద్యగద్యరూపములతో ఖండించియున్నారు ఆగ్రంథమిటవిస్తరించుటకు తావుచాలనందునవ్రాయలేదు.

మరియు పురాణాంతరమున (దేవీభాగవతమున)కుంతి పదిమాసములు మోసియే బిడ్డనుగని దాసీముఖమున వనమునకుబంపివేయుచుండ 'రాధ' యను సూతపత్ని యాశిశువునుదనకిమ్మనికోరగా నాదాసియామెకిచ్చెననికూడగలదు. ఈయంశమును దేవీభాగవతము నాంధ్రీకరించిన శ్రీదాసు శ్రీరామకవిగారును, శతావధానులు శ్రీతిరుపతి వేంకటేశ్వరకవులును నిటునుదహరింపుచున్నారు.

"...క. అనిపేర్మిగడలుకొనఁబ
లిక్కనవచ్చెలి మెత్తవడియె క్రీడారతులం
దనిపి వరమొసగిరవియును
జనియెందినమునకు మనను సంతసమెన
యట్"

"ఆ పిమ్మట నక్కుంతిమూలుదాల్చి దాదికిందక్క దక్కఁగలవారికిం తెలియనీక యంతఃపురమ్మునముండునెడ సహజకర్ణకుండలకవచాభిరామంబును సర్వప్రతిమానుఁడును సర్వలక్షణోపేతుండునునగు కర్ణుండుద్భవించిన లజ్జితానవయయి చింతించునక్కుంతికి ధాత్రేయియిట్లనియె.

క. కడచినపనికింజింతం
గడఁగొలుప నేల? భావి కార్యమ్మునకుం
బడతిరో! యాలోచితము
తడబాటేల! యనగుంతి తత్తఱపడుచుఁ

వ. ధాత్రేయికొనీతం బగుమందసమునందు.

క. బాలునిడికన్నగొనలం
గాలువలై నీరుపాఱ గాఁగదుఁబేర్మి
బాలిండ్లు స్రవింపఁగఁజిం
తాలోల మనస్కయగుచు నడలుచుఁబలి

కెన్

ఆ. వె. ఏమిసేయుదాన? నేమాచరించెడి
దాన? నేమిసలుపుదాన? మంచి
భాగ్యసైనవాని బహులక్షణయుతుండ
వీవు దిక్కువాడవే? కుమార!

... ... ...

క. పిదప దాదియామెనోదార్చి మంజూషంగొని రహస్యప్రకారమ్మున జనునెడమధ్యయగు రాధయను సూతగృహిణితనకిమ్మనియడుగ నద్దానికొసంగె రాధయునతనింగన్న కుమారుఁబలెఁ బోషించుచుండె

"అలమతివిస్తరేణ"

## రుద్రూరులో వ్యవసాయ ప్రదర్శనము

నిజామాబాదు జిల్లాలోచేరిన రుద్రూరుఅను గ్రామములో వ్యవసాయశాఖవారు ఇటీవల వ్యవసాయప్రదర్శనము చేసినారు. దానిని చూచుటకు రైతులుచాలామందివచ్చినారు కొత్తనమూనా నాగళ్ళు, గొఱ్ఱులు, గుంటికలు ప్రదర్శించినారు. సిగరెట్లకుగాను పొగాకునుసిద్ధము చేయువిధమునుచూపించినారు చెరుకుతొన్నలనుండి పర్దాతడకలు, బుట్లుచేయుటనుచూపించినారు పంటలు, పండ్లు, ప్రదర్శింపబడెను. ఉత్తమమైనవాటికి బహుమానాలిచ్చినారు. త్రివిక్రమసాధ అను తెనుగునాటకమును ఆడినారు.

---

## డిచ్పల్లి కుష్ఠరోగి శరణాలయని వేదిక

మ-ఘ-వ. నిజాంరాష్ట్రమందలి డిచ్పల్లిలోని కుష్ఠరోగిశరణాలయముయొక్క ౧౯౩౯-౪౦వ సంవత్సరపు నివేదికలో కుష్ఠరోగులకు చాలా లేనట్టియు, ఉన్నను ఇతరులకు వ్యాపించనిదశలోనున్న ఆరోగ్యముగలిగినట్టియు ౩౧౩ మంది విడుదలచేయబడిరి. ౬౫౫ మంది క్రొత్త రోగులు చేర్చుకొనబడిరి. సంవత్సరాంతంలో ౧౪౫౭ మంది రోగులకు చికిత్స చేయబడుచుండెను.

---

## గమనిక

౨౩-౫-౫౦నాటి గోలకొండ (౨౧)వసంచికరెండవకాలము పద్మశాలిపంచాయతిసంఘము శీర్షికగల వ్యాసమునందు శ్రీ పడిగెలోగయ్యగారికుమారుని వివాహమునకు బదులు కొమార్తెగా ప్రకటింపబడినందున ఇందుమూలకముగా సవరింపనైనది.

---

## సూర్యాపేట

### ఆంధ్రనాయకుల ప్రచారము

(స్వ-వి.)

౨౩-౨-౪౧

చందుపట్ల గ్రామము సూర్యాపేటకు రా మైళ్ళ దూరమున ఖమ్మంరోడ్డుపైనఉన్నది

ఇక్కడ సుమారు ఏడునెలల్కింద ఒక గ్రంథాలయము, అయిదునెలల్కింద ఒక వయోజన పాఠశాల స్థానికయువకులచే స్థాపింపబడి, నడుపబడుచున్నవి. సుమారు మూడు నెలలనుండి వయోజనపాఠశాలకు ఇంచుమించుగా (౪౦) మందివచ్చి విద్యనేర్చుకొనుచున్నారు.

గ్రంథాలయమునకు అధ్యక్షులు శ్రీయుత దేవులపల్లి వెంకటగోవిందరావు గారు, పుస్తకముల సంఖ్య సుమారు (౧౫౦)

గ్రంథాలయము ప్రస్తుతము స్వంతఇంటిలో నడుపబడుచున్నది. క్రొత్తభవన నిర్మాణముకొరకు ప్రయత్నములు జరుగుచున్నారు. ఉదారపురుషులైన శ్రీఅధ్యక్షులవారు భవనముకొరకు విశాలమైన చోటునశాశ్వతముగా దానమిచ్చినారు. నిర్మాణముకూడ ప్రారంభమైనది.

౨౫-౨-౪౧ ఈ మంగళవారమునాడు సాయంత్రము ౬ గంటలకు సూర్యాపేట ఆంధ్రజన సంఘాధ్యక్షులు, శ్రీయుత వేములపల్లి వెంకట కృష్ణారావు వకీలుగారు ప్రముఖనాయకులైన శ్రీయుతులు గవ్వా అమృతరెడ్డి, వేములపల్లి భాస్కరరావు, చకిలం వెంకటరంగారావు వకీలు, చకిలం శ్రీనివాసరావుగార్లతో ఇచ్చటికియచేసినారు. గ్రామప్రముఖులును, ఇతరజనులునువారిని ఎదుర్కొని కొత్తగాకట్టబడుచున్న గ్రంథాలయమును చూపించి, ప్రస్తుతపుగ్రంథాలయములోకి తీసికొనివచ్చినారు, సభ్యులకొరకుమంచి ఏర్పాట్లుచేయనయినది. నాయకులుగ్రంథాలయపు పుస్తకములను, పత్రికలను, సభ్యులసంఖ్య, పాఠకులసంఖ్య పరీక్షించినతర్వాత ఆంధ్రమహాసభప్రాముఖ్యతనుగురించి, వయోజనవిద్యవలన ప్రయోజనములగురించివిపులము, తేటతెలుగుభాషలో ఉపన్యసించి గ్రామప్రజలందరిని ఆంధ్రమహాసభకు సభ్యులుగా ఉండుటకుకోరిరి. తర్వాత శ్రీ చకిలం వెంకటరంగారావు గారు (కార్యదర్శి) లేచి, చందాధనముచెల్లించేవిషయములోను ఆంధ్రులకలిసి పనిచేయుటవలన లాభములనుగురించి మాట్లాడిరి. తర్వాత ఇచ్చటి గ్రామఆంధ్రజన సంఘముకొరకు కార్యనిర్వాహకవర్గమును ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి.

సమావేశానంతరము నాయకులు వయోజన పాఠశాలనుచూచిచాలసంతోషించినారు. విద్యార్థులకుకొన్ని నీతివంతములైనమాటలను, విద్యాప్రాముఖ్యతనుగురించిబోధించిరి. అధ్యాపకులనుకూడా వయోజనులకు విద్యగఱపుటకు తగువిధానమునుచెప్పి, అతీరునచే శేప్పవలయుననికోరిరి.

---

## ఖమ్మంతాలూకా ఆంధ్ర జన సంఘపు ఎన్నిక

౨౧-౨-౪౧ తేదిన ఈపురములో తాలూకా ఆంధ్రజన సంఘముయొక్క ఎన్నిక శ్రీ వెంకట సుబ్బయ్యగారి అధ్యక్షతన గ్రామోద్ధరణ ఆంధ్ర గ్రంథాలయములోజరిగెను. ముందు కార్యనిర్వాహకసభ్యులు నిబంధనల ప్రకారము ఎన్నుకోబడిరి— సభికులుదాదాపు ౪౦మంది రాగలిరి.

అధ్యక్షుడు కల్వల వెంకటరాజారాంగారు,

కార్యదర్శి సర్వదేవభట్ల రామనాథం „ ,

స.హ. కార్యదర్శి చిరంపూరి లక్ష్మీనరసయ్య ,

గౌరవకార్యదర్శి కోల్పాక వెంకటకిషన్ రావు

ఉపాధ్యక్షుడు హనుమయ్యచౌదరి „ ,

కోశాధ్యక్షుడు కందిరాజు యోగానందరావు „

ఇంతేగాకి మరికొందరు సభ్యులఎన్నుకోబడినారు. ఏడ్గురు తెహసీల్దారు మొక్రరుచేసియున్నారు. వారలయొక్క పేర్లుముందు తెల్పబడును

---

## యాద్గీరులో ప్రధానమంత్రిగారు

ప్రధానామాత్యులైన రై. ఆ. సర్. అక్బర్ హైదరీగారు యాద్గీరుకు వెళ్లినప్పుడు అచ్చటజనులఉత్సాహము మిన్నుముట్టెను. వీధులలంకరింపబడెను. జనులు క్రిక్కిరిసియుండిరి. గుంపులుగుంపులుగా జనులు శ్రీవారి మోటారును చుట్టివేసిఆపించి పూలవర్షాలను కురిపించిరి. అర్థశతాబ్దముతర్వాత హైద్రాబాదు ప్రధానమంత్రిగారిపట్టణానికిరావడము ఇది రెండవసారి.

శ్రీవారు స్థానిక కచ్చేరీలను చూచినతర్వాత ప్రజలు వారికి స్వాగతపత్ర మర్పించుకొనిరి. ౫౦ఏండ్లకిందట సర్ వికారుల్ ఉమ్రా ప్రధానమంత్రిగారు వచ్చియుండిరనియు ఇప్పుడీప్రధానమంత్రిగారు వచ్చుట అద్భుతమనియు తెలిపిరి. శ్రీవారు ప్రభువుగారికిని దేశానికిని చేసినసేవల నుగ్గడించిరి. ఉస్మానియా విద్యాపీఠస్థాపన రాష్ట్రంలో అభివృద్ధి శ్రీవారిమూలాన అయినదని తెలిపిరి. యాద్గీరువారు ౧౫ ౦౦ యుద్ధనిధికిచ్చినారు. యాద్గీరులో లేడీ హైదరీగారి స్మారకంగా ఒకప్రసవశాలనుకట్టించమని విన్నవించిరి.

అందుపై శ్రీవారిట్లుజవాబిచ్చిరి జనుల తోడ్పాటుతో స్థానికాధికారులు ప్రజాభ్యుదయానికెంతపాటుపడుచున్నారో తనకు తెలుసుకొని కుతూహలమున్నదనిచెప్పిరి. ఒకసిమెంటురోడ్డును నీటిసప్లయిస్కీమును కావలెనని సన్మానపత్రములో తెలిపినారు. ఆవిషయాలనుగురించి ఆలోచింతుమని సెలవిచ్చిరి. లేడీహైద్రీగారిని ప్రజలుస్మరించినందులకు తనకు చాలా ఆనందముకలిగినదని చెప్పిరి. ఆమెకష్టస్థితిలోనుండి వారికొరకై యెల్లప్పటికి శ్రమించుచుండెనని తెలిపిరి.

తర్వాత శ్రీవారికి విందు గావించిరి. శ్రీవారు అచ్చటనుండి బొంబాయికి వెళ్లిరి

### హట్టీలో ప్రధాన మంత్రిగారు

రై.ఆ. సర్ అక్బర్ హైదరీగారు యాదగీరునుండి హట్టీగ్రామానికివెళ్లిరి. వారివెంట సర్ టి. జె. టాస్కరుగారును, కే యం. అన్సారి గారును, లియాఖతుల్లాగారును ఉండిరి. హట్టీయాద్గీరునుండి ౬౦ మైళ్ల దూరంలోఉన్నది. అచ్చట బంగారుగనులను త్రవ్వుచున్నారు పూర్వం ౧౮౮౧నుండి—౧౯౦౦ వరకు ఈరాష్ట్రంలో బంగారుగనుల నుత్రవ్వుచు పనిచేసియుండిరి. వండలి, తోపుల దొడ్డి, హట్టీఅనుస్థలాలలో ౨౫౫౦౦౦ ఔన్సుల బంగారుతీసిరి. నాలుగేండ్లకిందటఈపనిని మరలప్రారంభించుటకై ప్రభుత్వంవారునిశ్చయించిరి. ప్రభుత్వంవారు అందుకుగాను ౩౫౦,౦౦౦ పౌనులఅంగీకారమిచ్చిరి. ఇప్పుడు హట్టీలో గనులు పనిచేయుచున్నవి.

ప్రధానమంత్రిగారు అచ్చటిపనులను శ్రద్ధగా తిలకించిరి. తర్వాత అచ్చట ఒకప్రాథమిక పాఠశాలయొక్క పునాదివేసిరి. ఆసందర్భంలో వారిట్లుచెప్పిరి "నేనువిద్యకై చాలాశ్రద్ధవహించినాను. నాకు ప్రాథమికవిద్యపై చాలా అభిమానం. ఇటీవలవిద్యావిధానంలో అందరికినీ లాభంకలిగే విధంగా ఏర్పాట్లుచేసినాము. ఈపాఠశాల భావికాలంలో ప్రభువుకుదేశానికి ప్రపంచానికి లాభకారిగా పరిణమించునని నమ్ముచున్నాను"

ఆసందర్భములో గుర్గుంటారాజాగారు యుద్ధానికి ౧౦౦౦రూ॥ ఇచ్చిరి.

మార్గంలో శ్రీవారు మోయినస్సాసాహేబు గుడికివెళ్ళిరి. అతడుజీవితకాలంలో అన్నిమతాలవారిలో ఐకమత్యం ఏర్పాటుచేసియుండెను.

---

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర: మాఘ బ॥ ౫

సోమవారము


# విచిత్ర తర్కము

...యిపోయినముచ్చటను మరలమరల చర్చించుట అనవసరమైయుండు ను.కానిఒకబలీయమైన ప్రతివాద ప్రకటింపవలసి వచ్చినందులకు దా సమాధానమీయక తప్పదు. బా వివాహ నిషేధశాసనమును హైద్రా దు శాసనసభవారు త్రోసివేసినది ంజసముగానే ఉన్నదని ఈబలీయ దములో తర్కింపబడినది. కాని మా తర్కము సమంజసముగా కనబడ ు.

హిందువుల కోరికపైననే హిందూ ందూద్వాహ శాసనమును మరియు గై రావగ్గై రాలను" హైద్రాబాదు సనసభ చేసెనన్నారు. ఈవగ్గై రాల ఇంకేమైన హిందూశాసనములుచేరి ? చేరినట్లుగానరాదు. లేకలేక ఒక ంతూద్వాహ శాసనము చేసినారు. ని హిందువుల అధికసంఖ్యాక స తులను తెప్పించుకొనియే చేసినారా? న ఆశాసనమునాటిజనులు ఇంతలో సంస్కారపథము వదలి శుద్ధసనాతను ోయిరా? హిందువులలో ఈబాల్య హ శాసనానిని ఎక్కువ అవలంబన ఉండినబాగుండెడిది. అనివ్రాసినా అయితే శాసనసభవారు స్పష్టము హిందూప్రజలు తమసమ్మతులను కాలమూలముగా మాకు తెలుపవ ియు వంతకాల సంఖ్యను బట్టియే ు నిర్ణయము చేయుచున్నామనియు టించియుండిరా? లేదు. అట్లుప్రక ియుండిన సంస్కారవాదులు ౧ ల దుకదా ౧౦ లక్షల దొంగసంతకా కమిషన్ సంతకాలు కాక మైన వంతకాలు తెచ్చి కట్టలు ుగా పడవేసియుండెడివారు.

అదేమిచిత్రమో మాపత్రికలో ఎ కప్పుడే బ్రిటిషిండియానుండి వచ్చి స్త్రాలుగావర్పడిన కొందరు వ్యక్తులు మాలలోపోయి ప్రజలకు అబద్ధాల ృష్టికాక ప్రభుత్వమువారికపక్షీర్తిక ు విషయములనే బోధించి జనులను నగించి కొన్ని దొంగసంతకాలను, కమిషనుసంతకాలను,యేమెరుగని ాయకుల వ్రేలిముద్రలను అడ్డముప ట్లుకా వేసవేలను ఒత్తించుకొని వా హడా సంతకాలక్రింద జమాకట్టిం ట్లో ఒకలక్ష చిల్లరసంతకాలను జత ృగలిగిరి. అవియే శాసనసభవారికి ప్రమాణమయ్యెను. అవి నిజమైన వను వాదమును కించిత్తుకూడ విమ కపోయిరి. ఇప్పుడు అలక్ష చిల్లర కాలచేతమాత్రమే రాష్ట్రములోని ోటి ౭౫ లక్షల జనులందరును స సులై పోయినారు.

ఇదొక పెద్దగారడి. రాష్ట్రములోమొ ు జనసంఖ్య ఒకటింపావుకోటి వుం ందరున్నా సనాతనులేలట! వీరికి సనాయకులలో Accredi ted le-rs పండిత్ వీ.పీ. నీలకంఠం గారొక వీరు పండితులెప్పుడై...రోయేమో!

ఒకటింపావుకోటి సనాతనులకు నీలంఠ గారే జగదేక నాయకులైతే ఇక ఈరా ష్ట్రములోని హిందువుల గతికి లోపమే మియులేదు. నీలకంఠంగారు ఏశాస్త్రాల లో ప్రవీణులు, ఏయేతీర్థ బిరుదములను ఏవిద్యాపీఠములో వహించివచ్చినారు.

సనాతననాయకులు జగదేకనాయకు లు. తక్కువవారు అనగా నేటివరకు హైద్రాబాదు రాజ్యములో ప్రజాసేవ లో త్యాగములుచేసి జెయిళ్లకుపోయి, స్వకార్యములను, స్వలాభములను వదలు కొని, రాత్రింబగళ్లును ప్రజాభ్యుదయాని కి కష్టించినవారందరును స్వయంభువులై న నా య కు ల ట! (Selfappointed custodians) ఇంతకన్న హాస్యాస్పద మగు వాదము మరియుండదు. యథార్థ ముగా సత్యమునే ఆధారముగా చేసికొని చెప్పవలసి వచ్చిన ఈవాదమును తల క్రిందుగా చేయవలసియుండును. సనాతన నాయకులే స్వయంభూనాయకులు. వా రినిఎవ్వరు ఎన్నుకొనిరి! అని పలుమా రుప్రశ్నించినను జవాబులేదు. ఇతరనా యకులను వివిధవర్గాలవారును, ప్రజలు ను సంస్థలపక్షాన ఎన్నుకొనిరి.

ఈవాదములో సనాతనులకును, హిం దూప్రజామండలికిని, (రెండును మతపా క్షిక వర్గాలే!) ప్రాధాన్యతనిచ్చి సాంప్ర దాయిక వర్గాలుకానట్టి ఆంధ్రాదిమహా సభలకుప్రాధాన్యతనీయలేదు. బాల్యవివా హనిషేధపు ముచ్చటనుగురించి మాట్లా డుచు శాఖాచంక్రమణముచేసి హైద్రా బాదు రాజ్యాంగములోకి దుమికి డాక్ట రుముంజీని హిందూప్రజామండలి మహా సభకధ్యక్షునిగాచేసి అచ్చట తీవ్రవివా దములకు గురియై సంశయాస్పదమైన వోట్లకే ప్రాధాన్యతనిచ్చి "చూడండి! హిందూ మహాసభవారు హిందువులకు ప్రాతినిధ్యము వహించినట్టివారు. వారు హిందువులకు ౫౦, ముసల్మానులనుగ౦ స్థానాలను శాసనసభలో అంగీకరించినా రు." అనివాదించుట సరియైన తర్కము కాదు.

డాక్టరు ముంజీ ఈరాష్ట్రీయ వారు కారు: బ్రిటిషిండియా రాజకీయాలలోనే వారికి పలుకుబడిలేదు. వారు హైద్రా బాదు హిందూ మహాసభకు అధ్యక్షత వహించలేదు. హిందూమహాసభ హిం దువులందరికిని ప్రాతినిధ్యము వహించు నట్టిదికాదు. ఆంధ్రమహాసభ సంపూర్ణ ముగా దానిని బహిష్కరించెను. అన గా ఇదేతర్కరీత్యా ౨౦ లక్షల ఆంధ్రు లకిది ప్రాతినిధ్యము వహించదు. సనా తనులునుహిందూమహాసభలో పాల్గొను టవ్యక్తముకాలేదు. అనగా ఇదేతర్క ముప్రకారము ఒకటింపావుకోటి సనాత నులు దీనిలో పాల్గొనలేదనవలెను. ఆర్య సమాజమువారు దీనిలో ప్రతిఘ టన చేసిరి. వచ్చిన ఆకొద్దిపాటి హిందు వులలోను నూటికి ౪౦ పాళ్లురాజ్యాంగ శాసనాన్ని ప్రతిఘటించిరి స్టేటుకాంగ్రె సువారును దీనిలోపాల్గొనలేదు.

ఇట్లున్నను రాజ్యాంగ శాసనముపై హిందువుల నిశ్చితాభిప్రాయము తెలుసు కొననలెనసిన ఇకముందుజరుగుహిందూ మహాసభలో కేవలము ఈరాజ్యాంగ మును గురించిన శాసనము హద్దువరకు అభిప్రాయమిచ్చుటకుగాను ఆంధ్రమహా సభవారును తదితరులును పాల్గొని, అతీర్మానముపై మాత్రము తమఅభిప్రా యమును వోట్లరూపమున ప్రకటించి బ యటికి రాగలరు. అట్లుచేసినచో యిట్టి తర్కాలు బయలుదేరుటకు అవకాశ ముండదు.

ఓట్లేప్రధానమైన ఇప్పటికిని మించిన దిలేదు. రెండుమూడుమాసాలలో ౧౦ల క్షకాదుకదా ౧౦లక్షల సంతకాలను సంస్కారవాదులు తెచ్చి పడవేయగల రు. కొచ్చిన్ సంస్థానములో మనరాష్ట్ర ములోని సనాతనులకన్న కఠినాచార స నాతనులున్నారు. మన సంస్థానములో బాల్యవివాహము ఎత్తిపారవేయ బడిన తర్వాతనే ఆసంస్థానశాసన సభవారుఅ ట్టిశాసనమునేకావించిరి.

ఈవాదములో ఒకఅంశానికి మా త్రము ఎందులకో సమాధావ మీయలే దు. మనపూజ్యప్రధానామాత్యులవారు ఒకనిర్ణయమును చేసియుండిరి. ఒకేమత స్థులకు సంబంధించిన మతశాసనముల లో ఇతరమతస్థులైన శాసన సభ్యులు వోట్లియ్యరాదని నిర్ణయించి యుండిరి దానికి విరుద్ధముగాఓట్లిచ్చిన స భ్యుల చర్యలు సరియైనవాకావా యేమి యు తెలుపకపోయిరి.

మేమిదివరలో వ్రాసినట్లుగా హిం దూసంఘములో సనాతనులనియు, సం స్కారులనియు సవర్ణులనియు, అవర్ణులని యు లింగాయతులనియు, తదితరులని యు ఈవిధముగా సంఘములో చీలికల గుట ఏమాత్రమును శ్లాఘ్యముకాదు. అ యినదేమోఅయినది. ఇకముందైనను రాజకీయముల హద్దువరకైనను హిందు వులలో చీలికలులేకుండా చూచుకొను టలో సనాతనులకును, సంస్కారులకును, ఆదిహిందువులకును, లింగాయతులకును, సమానమైన బాధ్యతకలదని నొక్కిచె ప్పుచున్నాము: కావున ఈవిషయములో మెలకువతోనుండ గలరని మనవిచేసుకొ నుచున్నాము. అటులుండకుండిన అంద రును సమానముగా నష్టపడగల మనిర రొకమారు పూని చెప్పుచున్నాము.

## ఓరుగల్లుజిల్లా ఆంధ్రజన సంఘము

ఆహ్వానము

ఓరుగల్లుజిల్లాసంఘ కార్యనిర్వాహకసభకు జిల్లా సంఘసభ్యులును, పుర తాలూకాసంఘముల ప్రతి నిధులును దయచేయ ప్రార్థితులు.

ప్రదేశము— హనుమకొండ, జిల్లాసంఘాధ్య క్షునిగృహము.

సమయము— (3) అర్దిబెహిష్తు ౫౦౩౫౦ ప శుక్రవారము ఉదయము ౧౧–గంటలకు

ముఖ్యచర్చనీయాంశములు: వార్షిక నివేదిక, తీర్మానములు.

ఇట్లు
విన్నవించు విధేయుడు
అ॥ వెంకటరావు
కార్యదర్శి

## జర్మను,ఫ్రెంచ్ పారిశ్రామిక నాయకుల సంప్రతింపు

...డిసరుకులవిషయంలో "సహాకారంగాచే యుటకుగాను జర్మనీ, ఫ్రెంచ్ పారిశ్రామిక నా యకులు పారిస్‌లో ఫిబ్రవరి ౨౧ వతేదిసమావే శమయిరి ఒక్కొక్కపరిశ్రమకు ఒక్కొక్క కమిటీని నియమింతురు. ముఖ్యంగాబొగ్గు, లోహ ాలు, నూలుగుడ్డలు, కాగితం మొదలగుముడిసరకుల కు ఒక్కొక్కకమిటీ ఏర్పాటుచేసెదరు.

## జనాభా

(స్వ-వి)

చండుపట్ల, ౨౭-౨-౪౧

చండుపట్ల నల్లగొండతాలూకలోని గ్రామము నకిరెకల్ హల్కాలోచేరినది. ఇచ్చట శ్రీయుత ముసుగాలరామకృష్ణయ్యగారిని మీరెవరని షు మారుకునిందయగు శ్రీకోటగిరిరాజయ్యగారు ప్ర శ్నించ, మేముఆర్యులము, మాధర్మము వైదికము అనిచెప్పిరి. స్థానికతహశానియా షెడుమాస్టరు గారు పరీక్షార్థమైవచ్చి జార్మ్నావిధిస్థాము పం చునామాచేయిస్తామని సుమారుకునిందను బెద రించి అర్యపదమునుకొట్టివేసి హిందువనివ్రాసినా రు. ఆ వరోజున గిర్దావరుగారువచ్చి రామకృష్ణ య్యగారినిబెదరించి 'హిందువు' అనేచెప్పాలి అనిపంచనామాచేసికొనినారు. దానికి అసంతృ ప్తిగా తహసీల్దారుగారికి తాలూకాదారుగారికి విన్న పపత్రములద్వారా, ఇటువంటిఅన్యాయపు జనగ ణనవిషయమై కడుజాగ్రత్తవహించి జాబితాకా ర్యాలుజరుపునందులకు తెలిపినారు.

ఇదినూర్యాపేటకు 3 మైళ్ళదూరమునగలదు. ఇచ్చటఒక హరిజనునికుమారుడుమాత్రము క్రై స్తవమతమును స్వీకరించినాడు. ఆతనితండ్రియగు నీలచంద్రయ్యఇంటినెంబరు(౧౩౪) తమనుహిందు వనివ్రాయుగలరనులకు ఎంతచెప్పినను అచ్చటిగి ర్దావరుగారు క్రైస్తవుడని బలవంతముగ వ్రాసు కొనిపోయినాడు.

## దొంగజనాభా

చొప్పదండి, ౨౮-౫-౫౦ ఫ

ఈగ్రామముతాలుక కరీనగరంలోచేరినది. దీ నిసమీపమునవే "మొకరంగనగర్"అనుపేరుతో క్రొత్తగ్రామముకట్టబడుచున్నది. చొప్పదండిలో ని బురుజులనుపడగొట్టి వాటిరాయిని క్రొత్తగ్రా మమునకువాడుచున్నారు.

ఈగ్రామములో దూదేకులవాండ్లవి, తురక వాండ్లవి సుమారు ౩౦ ఇండ్లుగలవు దాదాపు ౨౫౦ జనులుగలరు. కాని ప్రస్తుతజనపరిగణము లో ౪౫౦ మంది లెక్కకువచ్చినారు. ఈవిచిత్ర సంగతివిని రక్షణం ౩ ఇల్లునం(౨౪౯) మహమ్మ దుయిస్మాయిల్ ఇంటికిబోయిచూడగా ఇంట్లో నల్గురుమాత్రమేగలరుకాని వారు జనపరిగణము లో ౧౩ మందిపేర్లు వాయించినారు బాధ్యతగ లఉద్యోగివచ్చి విచారణసలిపిన మేముఋజువు చేయగలము.

ఇట్లుఅబద్ధపుసంఖ్యను పెంచుట ఇచటనేగాదు ఈ జిల్లాఅంతటజరుగుచున్నట్లు తెలియవచ్చుచు న్నది. ప్రభుత్వమువారు తగినకట్టుదిట్టములు చే యుదురుగాక.

ఇట్లు
(ఈ) ఎల్లారెడ్డి
చొప్పదండిగ్రామం కరీంనగరంజిల్లా

## జనాభా అవకతవకలు

(స్వ.వి)

మహబూబునగరం, ౨౫-౫-౫౦

శివ, విష్ణు, మాధ్వ మతముల తప్ప తదితర బ్రా హ్మణేతరులనగా రెడ్డితెలగు, బోయితదితరహిం దువులందరిని సగముహిందువులనివ్రాయుచున్నా రు. సరిగాహిందువులను హిందుఅనివ్రాయువారి ని బెదిరించి, బలవంతముగా సగముహిందుఅని వ్రాయించుచున్నారు.ఇండ్లసంఖ్య తీసుకొనునప్పు డు మహమ్మదీయులు మొదటమాయించిన జన సంఖ్యకన్నను హెచ్చుమాయించుచున్నారు ఈ రీతిగా మహమ్మదీయులసంఖ్య హెచ్చుచేసి.హిం దుసంఖ్యనుతగ్గింప ప్రయత్నించుచున్నారు. ఈ లాటిజనాభాసంఖ్యనువ్రాయించప్రయత్నించినని జమైనజనాభాసంఖ్య తెలియనేరదు.

## ఉపన్యాసము

హైదరాబాదు, ఫర్వర్ది ౨౫

శుక్రవారముసాయంత్రము హైద్రాబాదుకృ ష్ణదేవరాయాంధ్రభాషానిలయములో వానమామలై వరదాచారిగారు కవితనుగురించిఉపన్యసించిరి. వి దురు వెంకటశేషయ్యగారుఅధ్యక్షతవహించిరి. ఉ పన్యాసకులు కవితనుగురించి అపూర్వాభిప్రా యాలను వెల్లడించిరి. తర్వాతకొన్నివ్రాసిన కొ న్ని పద్యాలను శ్రావ్యముగా చదివి వినిపించిరి. వా రిపద్యములను సభ్యులందరుచాలాఆనందముతో వి నిరి. పద్యాలలోమంచిశైలి మంచిభావములు అం దమైనకొత్తవర్ణనలు ఉండినవి. కవిగారు ఒకఖం డకావ్యముగా వాటిని ఏల ప్రకటించరో యేమో!

## బాల్యవివాహ నిషేధ శాసనము

ఒక విమర్శ

హైద్రాబాదు ప్రభుత్వము బాల్యవివా హనిషేధశాసనాన్ని త్రోసివేసినందులకు తీవ్రవి ...కుగురియైనది ప్రభుత్వవిమర్శకులు ఇదివ హిందువులకు సంబంధించినవితంతూద్వాహ నము వగైరావగైరాలను గురించి మాటిపో న్నారు. అవిహిందువుల కోరికపైననే కావి డెను. బాల్యవివాహనిషేధములో రెండభిప్ర ములకుతావులేదు. హిందువులలో ఎక్కువ దానికనుకూలముగా ఉంటే బాగుండెడిది. దూప్రజల అభిప్రాయాన్ననుసరించియే ప్ర సభ్యులన్నూ ముస్లిం సభ్యులన్నూ వర్తిం న్నారు. శాసనసభలోని హిందూసభ్యులు దువులఅభిప్రాయాలను తీసుకొనుపద్ధతులు ఘూయిష్ఠములైయుండెనని ఆక్షేపించిరి. వి ...అభిప్రాయము లభింపలేదనిరి. ఇదేప్రశ్న వారు వితంతూద్వాహశాసనము నాడుఅని ప్రజాభిప్రాయము తీసుకొనినప్పుడు శాసన ముగా లక్షలమంది అభిప్రాయమిచ్చిరి-అ లముగా వందలమందిమాత్రమేయిచ్చిరి- అ ప్రభుత్వసభ్యులును, ముస్లింసభ్యులును శాస నువ్యతిరేకముగా వోటు ఇయ్యవలసివచ్చెను.

సాంఘిక శాసనమంతయు అంగీకార నసేఉండవలెను. బలవంతము కూడదు. హి ప్రజలఅభిప్రాయము శాసనవిరుద్ధముగా ఉ ని సత్యసంధులెవరును అనగలరు. సనా ఘోరముగా ప్రతికూలురైరి- కందలకొలది చేసిరి. శాసనసభజరిగిననాడు చాలామంది ముగా సభముందునిలిచిరి, శాసనము ఎత్తివే డగా తమవిజయాన్ని సభలమూలమున ప్రక రి. ప్రభుత్వము వారిని అభినందించిరి.

...కాఏమైనా అనుమానముంటే ప్రజా కులని ఒప్పుకొనబడిన నాయకుల ఉపన్యా చదువండి పండిత్ వీ.వీ. నీలకంఠము స కార్యదర్శిగారు ఒకసభలో అధ్యక్షతవహి ఒకటింపావుకోటి రాష్ట్రసనాతనుల కృత ప్రభుత్వమువారికి తెలుపుకొనిరి- ఆర్యసమాజ రును ఇతరులును సనాతనులఆచారములలో లియ్యకూడదు. ఖబర్దార్ అనిచెప్పిరి-ఇంకోస రామమూర్తి అనునతడు అధ్యక్షుడయ్యెను- వారు శత్రువులఆక్రమణమునుండి సనాతన రక్షించినందులకు ప్రభుత్వంవారికి కృతజ్ఞత వారు- ఈ శారదాశాసనము విష్ణుకారిత సనాతనమతముపై దెబ్బతీయుచున్నదనివ్రా సివారు- హిందువుల ప్రతికూలతను చూపిం కొనిదర్శనాలున్నవి- కావునప్రజానుమతి శాసనానికుండినదని వారిథ్యోరణిలో సారము ని పైకారణాలు రుజువుచేయుచున్నవి-

హిందువులహక్కులను రక్షించుటకు ...యంభువులైన" నాయకులను గురించి ఒకమా వారివాదముప్రకారము కొన్ని హిందూసంస్థల ప్రాయాన్ని ప్రభుత్వమువారు పాటించ యుండెను- శాసనసభలోని హిందూసభ్యుల ప్రాయంలో ఆంధ్రమహారాష్ట్ర కర్ణాటకమ భలలో ఈశాసనానికనుకూలముగా తీర్మా బడియుండెను- కానియీసంస్థలుహిందువుల మునమాట్లాడజాలవు- ఇప్పుడలిగిపోయిన స నకాంగ్రెసువారు హైద్రాబాదు రాజ్యాంగ సంస్కారములకువిరుద్ధులు- కాని డాక్టరు మూ అధ్యక్షతలోజరిగిన హిందూప్రజామండలి రాజ్యాంగశాసనమును అంగీకరించినారు- స లసంఖ్య సరాసరిగా ఉండుటను వారొప్పు న్నారు-

## నిజాంభవనం-బొంబాయి

బొంబాయి మ-ఘ-వ-నిజాంప్రభువుగారి వనముకలదు. యుద్ధకాలములో బాద్షా ఆభవనమును వాడుకొనుటకుగాను మ-ఘ-వ భువుగారుఅనుమతించినారు. ఇదివరలో శ్రీ ఢిల్లీభవనాన్ని యుద్ధావసరాలకు వాడుకొను సెలవిచ్చియుండిరి.

## జనాభా

ప్రభుత్వప్రకటన

హైదరాబాదు (దక్కన్),పర్వర్ది ...

ఈజనాభాలోజనులు తమకులములపేర్లు కిష్టమున్నరీతిగా వ్రాయించవచ్చును. ప్రజ ...మతములేక కులమునుగురించి రొట్లుచెప్పి ట్లువ్రాసుకొబడును.

ఆస్పత్రిలలో జ్వర బాధితులకు ఇచ్చు ఆహారము అతిశ్రేష్ఠమైన ఫలితము

మానవులకు జ్వరమునుండి ఎట్టికీడుకలుగునను వది పరిశోధించబడినది. శరీరతప్తము హెచ్చుట, తలనొప్పి! వేకిమి; వెంటనే వణుకునంటి చలి, ఇవన్నిటికికారణము జ్వరపువిషము వరసైయు వులలో ప్రవేశించుటచేత అని డాక్టర్లు కనిపెట్టియున్నారు. ఈవిషము అతివేగముగా దేహమందు ప్రవహించి బలహీనతను కలిగించుటచేత శీర్ణశక్తినశించును. ఏలాటిఘనఆహారము తీసుకొనజాలదు. ఎట్టిఆహారమివ్వవలయునునదే ఆలోచన.

ఈఆలోచన హార్లిక్సువలన అంతమొందినది. చాలకాలము పరీక్షించబడి. ఇవితగుమైన ఆహారమనియు, సులభముగా జీర్ణశక్తిని చేకూర్చునని యు బుజువుపరుపబడినది జీర్ణశక్తిని హానికలుగనీయదు. రోగదకాలముతగ్గించును ఇట్టి శ్రేష్ఠ ఫలితము ఇచ్చునదిగాన సాధారణముగా అన్ని ఆస్పత్రులలోను దీనిని చలిజ్వరము. మఱితర జ్వర బాధితులకు ఇచ్చు ఏర్పాటు చేసియున్నారు.

మా చందాదారులకు సూచన

దయచేసి తాము ఉత్తరములు వ్రాయునప్పుడు తమ చందానెంబరు తెలుపగలరు.

## స్త్రీల సాంఘికస్థితి

ఫిబ్రవరి ౨౬వతేదిన సికింద్రాబాదు ఇండర్ టాకీసులో బొంబాయినుండివచ్చిన శ్రీమతి కుందర్ష్వేకర్ గారు స్త్రీలసాంఘికస్థితినిగురించి ఉపన్యసించిరి. మొదటబాల్యవివాహమువలన అనర్థాలనుచెప్పి, హైదరాబాదుశాసనసభలో బాల్యవివాహనిషేధశాసనమునిరాకరించబడి యుండుటశోచనీయమనిరి. అయినను స్త్రీలు ఐకమత్యముతోకృషిచేసినచో ఈబాల్యవివాహదురాచారమునశించగలదనిచెప్పిరి. పాశ్చాత్యవాగరీతినుఅంధప్రాయముగా అనుకరించుచు ఫ్యాషన్లకై పెద్దవ్యయములు చేయరాదనిచెప్పిరు. పర్దాపద్ధతి పనికిరాదనెను. ఉపన్యాసముయొక్క అంతమువలసభనేర్పాటుచేసినట్టి హైదరాబాదు మహిళానవజీవనమండలిలో యూ॰ జ్ఞీవసభ్యురాలుగా చేరి, మండలికి ౫౦ రూ. ల విరాళమిచ్చినట్లు ప్రకటించెను. ఈసభకు రాణీకరణ ప్రసాద్ గారు అధ్యక్షతవహించిరి.

## హైదరాబాదు ఆకాశవాణి సౌకర్యవ్యాప్తి

హైదరాబాదు (దక్కను), ఫర్వరి ౨౮ త్వరలో ఔరంగాబాదులో ఆకాశవాణి స్టేషనుప్రారంభోత్సవమును శ్రీ. అ. సర్. అక్బర్ హైదరీగారుచేయగలరు. ఈసందర్భములో ఏర్పాటులన్నియు పూర్తియైనవి. ఈస్టేషనుండి మరట్వాడా ప్రాంతీయగ్రామజనులకొఱకై ఉర్దులోను, మరాఠీలోను ఆకాశవాణి పలికించబడును, హైదరాబాదు నగరంలోకూడా ఆకాశవాణిస్టేషనుయొక్కపనిని ఎక్కువచేయుటకు ప్రయత్నాలు జరుగుచున్నవి.

## హైదరాబాదు యుద్ధనిధి

౭-౧-౧౯౪౧ తేదీవరకు హైదరాబాదు యుద్ధనిధికిగాను ౨౫-౨౪౧౦ పౌలీలున్నూ ౨౪౧౨౪ కల్దారులును వసూలయ్యెను. నెలచెందాలు ౯౯౬౫ పౌలీలున్నూ 333౯ కల్దారులున్నూ వసూలయ్యెను.

## ప్రజాపక్ష విద్యా మహాసభ

పర్భణిలో జరుగనున్న పైమహాసభయొక్క ఆహ్వానసభ్యులకు ౫ రూ. రుసుమున్నూ ప్రతినిధులకు ౨ రూ. ల రుసుమున్నూ ప్రేక్షకులకు ౮ అణాలున్ను నిర్ణయింపబడినది. హరిజనులకును స్త్రీలకును ప్రత్యేకసౌకర్యములేర్పాటుచేయబడినవి. చిత్తుతీర్మానాలంపువారు కనిష్ఠము ౧౫ దినాలుముందుగా కార్యదర్శికంపవలెను.

## హెచ్చరిక

కొన్నిమాసములనుండి సికింద్రాబాదుకొంపురస్థుడు, వైశ్యుడు, సనాతనవాదిఅనుకొను వంగపల్లినీలకంఠంగారు ఆర్యసమాజీయులపైనను, దేశభక్తులుచేయు సాంఘికవిషయములపైనను, హాడావుడిజేయుచున్నటుల పత్రికద్వారా తెలియుచున్నది.

వారిప్రకటనలకు శాసనపోక, సత్యమైనవిషయములకు యెవ్వరుపాటుపడుచున్నారో వారిసేలను స్మరించి దేశమునకు, మతమునకు మేలుచేకూర్చుగోరుచున్నాను. ఈదిగువవిషయములు చూచుకొని జాగ్రతగా వుండవలయునని హెచ్చరించుచున్నాడ.

మర్దుంషుమారీలో, ఆర్యసమాజీయులు, తమభాష 'హిందీ'అనియు, తమమతము 'ఆర్య' అనివ్రాయమని అన్నారు, కావున యెవరున్ను వాండ్లమాటలువిని అట్లువ్రాయకూడదని ప్రకటవచేసినది చూచియుందురు.

ఆర్యసమాజీయులు మాతృభాషనువిడచి హిందీవ్రాయమనిచెప్పలేదు. తమతమ మాతృభాషను తెలుపుచు యితరభాషను అడిగినప్పుడు హిందీ అనిచెప్పరున్నారు గాని. తమమాతృభాషనువిడచి హిందీసేవాడమని చెప్పలేదు.

'ఆర్యు'డనగా యేమి అర్థమో తెలియనివారిమాటలకు మోసపోక, ఆర్యుడనగా శ్రేష్ఠుడుఅని, అర్థమని తెలుసుకొని స్పష్టముగావ్రాయించవలెనని కోరుచున్నాను.

ఇట్లు
ఒక సంఘశ్రేయోభిలాషి.

## సికింద్రాబాదు అప్పగింత

సికింద్రాబాదును హైద్రాబాదు ప్రభుత్వంవారికి అక్టోబర్ నెలలో అప్పగింతురని ఒక వార్త బయలుదేరినది—యీ మార్చినెల తుదిలో కాదట!

## నిమ్నజాతి నాయకుని అభియోగము

సికింద్రాబాదుకోర్టులో గౌరవమేజస్ట్రీటుకచేరీలో హైద్రాబాదుడిప్రెస్డుక్లాసుసంఘాధ్యక్షులవారిని గౌరవకార్యదర్శిగారు కొట్టినందున అధ్యక్షులు ఒకఅభియోగమును తెచ్చినందున అది ౩-౩-౪౧ నాడు అనగా యీదినము విచారణజరగనున్నది.

## నాందేడు అల్లరి హత్యానేరము ఎగిరిపోయింది

కొన్నిమాసాలక్రిందట నాందేడులో జరిగినఘోరాలలోని ఖూనీ,డాకాల నేరములు రెండుచాలాఛేయబడియుండెను. ఈరెండు నేరాలలో సాక్ష్యము లేనందున న్యాయస్థానమువారు కొట్టివేసినారు. రెండునేరాలలోని నిందితులు విడుదల(బరీ) చేయబడినారు.

## ౪౦ నగరాలలో ఊరేగింపులనిషేధము

పంజాబులోని ౪౦ పట్టణాలలో ఒక్క సంవత్సరంకాలమునరకు ఎవ్వరునుఊరేగింపులుచేయగూడదని ఇండియాసంరక్షణ శాసనమనుసరించి ఆజ్ఞలుకావించినారు.

శుభాశుభసమయాలలో ఊరేగింపులు అవసరమైతే జిల్లాఅధికారి సెలవుపొంది చేయవచ్చును.

## ఆకస్మికోపద్రవ చికిత్సనేర్పాటు

హైదరాబాదు (దక్కను) నగరమందు జాంబాగులో సుందర్ భవనవద్ద అనాథవిద్యార్థిగృహమందు పది, పదినైదురోజుల క్రిందనుండి ఆకస్మికోపద్రవచికిత్స నేర్పుటకేర్పాటుచేయబడెను. వారానికి రెండుసార్లు డాక్టర్ కేస్కర్ గారు సెయింట్ జాన్ అంబులెన్సువారిపద్ధతిని నేర్పుచుందురు. ప్రస్తుతము ౧౫ గురు బాలురకు నేర్పబడును.



## ఇరానీల దౌర్జన్యం

(ఓ. వి.) బాన్సువాడ ఫర్వరి ౯

౨౭ఫరవరి సాయంత్రం ఆరుగంటలకును మూరు డజన్లమందియిరానీలుదేవులూరు తాలుక మార్గంగయిక్కడికివచ్చిరి. ఇద్దరిముగ్గురి వర్తకులను మోసపుచ్చిరి, చుట్టుపట్లుగ్రామాలలో ప్రజలను భాధించి చందాలనువసూలుచేసిరి. ఈగ్రామమునకురెండు మైళ్లదూరమున దేశాయిపేటగలదు అక్కడికికూడ యిరానీలుపోయి అమాయకులగు ప్రజలనుభయపెట్టి మితిమీరినచందాలు వసూలుచేయుటనుప్రారంభించిరి. కానిఅక్కడిప్రజలుతమ ధైర్యసాహసముతో పట్టుపలచూపి చందాలుయివ్వనిరాకరించిరి. తుదకువాపసువచ్చిరి. యిక్కడ కూడకొద్దిగాచందాలువసూలుచేసిరి. కొందరులంబాడీలు కట్టెలబండ్లను అమ్ముటకువచ్చిరి, వాండ్లబండ్లనుబలవంతముగా పెట్టిపట్టిరి. ౨౫ఫరవరివాడు యిక్కడినుంచి యెల్లారెడ్డికిపోయిరి. ౨౬ఫర్వరివాడు తాలుకుదారుగారుజనపరిగణనమువిషయమై యిక్కడికివచ్చి చుట్టుపట్లుగ్రామాలకుపోయిరి.

ఈగ్రామమునకు అగ్నిప్రమాదం సమీపంలో కోడుకోలుఅనుగ్రామములో రెండువాండ్లవి అనుపూరిగుడిసెలయిండ్లుకాలి భస్మమయిపోరా సు. ౨౫ఫరవరివాడు శ్రీయుతవిఠల్ రెడ్డిగారి చెరకుఆయిల్ యింజనుకు అగ్నితగిలికాలిపోయెను. సుమారు వేయిరూపాయిలనష్టమాయెను.

## హిట్లర్ ఎత్తులు

ఇంతలో జర్మనుసేన ఇంగ్లండుపై దాడివెడలుననియు అందుకుగాను యింగ్లీషుసేనలో గందరగోళముకలిగించి మోసపుచ్చుటకై ఇంగ్లీషుసేన తొడుగువట్టిదుస్తులనే ౭ లక్షల దుస్తులనుసిద్ధము చేయించినాడనియు ౭ లక్షల పారషూట్లనుకూడా హిట్లర్ సిద్ధముచేయించినాడనియు, విష వాయువులను విశేషముగాసిద్ధముచేసినాడనియు ఆతనిపూర్వ కార్యదర్శియైన ఊాయూజాన్సక్ అనువాడు బయలుపెట్టినాడు.

## డాన్జిగ్-పోలెండుల ఆర్థికసంభాషణలు

డాన్జిగులోని నాజీప్రతినిధులకును పోలెండులోని జర్మనుగవర్నరు జనరల్ కునునడుమ ఆర్థిక సంభాషణలు వార్సాలో ప్రారంభమైనవి. వాని ముఖ్యతిరేక నాజీనాయకుడు హెర్ ఫోర్ స్టర్. వానికటి డాన్జిగుసెనేటర్ అగు హెర్ హాల్ ఇందుకుగాను వార్సాకువచ్చిరి. డాన్జిగునకు జర్మనీఅధికారంలోఉన్న పోలిష్‌భూభాగానికి నడుమ ఆర్థికసంబంధం తిరిగినెలకొల్పేఉద్దేశంతో ఈసం ప్రతింపు జరుగుచున్నది. పోలెండులో సంబంధములేకుండా డాన్జిగుజీవించగలదని జర్మనీచేస్తున్నవటః సరికాదనుటకు ఈసంభాషణలే నిదర్శనము.

౧౯౧౯ కుపూర్వం బాల్టికులో జలాంతర్గాముల ఆశ్రయంగా తప్ప డాన్జిగుఉపయోగం జర్మనీకిమరేదీలేదు. ౧౯౧౯ తర్వాతడాన్జిగుతో సంబంధమునుసంబంధం■ఏర్పడినవెంట నేడాన్జిగులో వర్తకంవిపరీతంగా హెచ్చినది. ప్రస్తుతప్రయత్నాలవల్ల పోలెండునుతుడిచిపెట్టుటకు జర్మనీచేస్తున్నచర్యలు డాన్జింగుకుకూడా హానికరమైనవనిస్పష్టమగుచున్నది.

### బ్రిటను, జర్మనీల యుద్ధము

ఫిబ్రవరి౨౧వతేదినుండి ౨౭వతేదివరకు వచ్చినవార్తలలో బ్రిటనుపై జర్మనువిమానాల దాడులనుగురించినవాటిలో గొప్ప విశేషాలు చాలా తక్కువ.

దక్షిణవేల్సులోని ఒకనగరం ఫిబ్రవరి౨౦వతేదిరాత్రి ప్రథమభాగమునందు జర్మనువిమానదాడులకుగురియైనది. చీకటిపడినవెంటనే జర్మనులు మాటిమాటికి ఈనగరంపైని దాడుచేసిరి. అదాడులనుఅరికట్టుటకు యెంతజోరుగా ప్రయత్నించినను ఆనేకమైన మంటలబాంబులు పేలపడినవి. పెద్దవగు కొన్ని ప్రేలుడుబాంబులు కూడా పడినవి.

ఫిబ్రవరి౨౧వతేదిరాత్రి మూడున్నరగంటలకాలం జర్మనువిమానాలు దక్షిణవేల్సులోని ఒకపట్టణంమీద ప్రేలుడుబాంబులు, మంటలబాంబులు వేసెను. ఇండ్లకును, వర్తకభవనాలకును నష్టముకలిగెను. కొంతమందికి అపాయముకలిగినది. వారిలో కొందరుచనిపోయిరి. తూర్పుఇంగ్లాండుపైకూడా ఆరాత్రికొంతసేపు దాడి జరిగెను. లండన్ ప్రాంతంలో, కొన్ని బాంబులుపడినవి. అయితే ఎక్కువ నష్టంకలుగలేదు అపాయం పొందినవారి సంఖ్య చాలాతక్కువ.

ఫిబ్రవరి౨౪వతేది పగటిపూట ఫ్రెంచితీరముపై బ్రిటిషువిమానను కొంతతీవ్రమైన గస్తీ సర్యలనుజరిపినది. రెండు బ్రిటిషువిమానాలు తిరిగిరాలేదు.

“సర్వషా” అనేక స్త్రీనాక శత్రువులచర్యవల్ల నష్టమయిందని దక్షిణాఫ్రికాకారకుణశాఖవారు ప్రకటించినారు.

## అల్ఫాన్జోరాజు మరణం

పూర్వపు స్పెయినురాజగు అల్ఫాన్జో ఫిబ్రవరి ౨౮వ తేదిన తన ౫౪వ యేటఒక రోమ్‌హోటలులో ప్రశాంతంగాచనిపోయినట్లు ఒకవార్త వచ్చినది అధునికకాలంలో ఇతనివలె కల్లోలిత సంఘటనలకు పాల్పడ్డరాజు ఇంకొకడు లేడనిచెప్పవచ్చును. మాడ్రిడ్ వీధులలోఇతని వివాహదినం నాడు ఇతనిపైబాంబులు వేయబడినవి. మరియొకసార్లుఇతనిపై హత్యా ప్రయత్నాలు జరిగినవి.

స్పెయిన్ కిరీటానికి తనకుగలహక్కులన్నిటినీతనకొడుకు అగు యువాన్‌కు వదలిపెట్టి ప్రకటనచేసినకొద్దివారాలలోపల ఇతడు చనిపోయెను. హృద్రోగానికై ఇతడురోమ్‌హోటలులో చికిత్స పొందుచుండెను.

వీరిని చేరగలిగిన రాజకుటుంబం వారందరును చేరిరి. వీరిలో ౧౯౩౧ నుండి వేరుచేయబడిన వీరిభార్య విక్టోరియా యూజీనియా రాణికూడా ఉన్నది. ఇటలీ యువరాజుకూడావచ్చియుండెను.

## పూర్వజెక్ ప్రధానికి ౧౫ ఏళ్లు కఠినఖైదు

ఇదివరలో జెకోస్లోవాకియా ప్రధానిగాపనిచేసిన డాక్టర్ మిలాన్ హోడా గారికి ఫిబ్రవరి ౨౧వ తేదిన బ్రాటిస్లావాలో ౧౫ఏండ్లకఠినఖైదు విధించెను.

వీరు, వీరిఅనుచరులు స్లోవాక్‌ప్రభుత్వముపై కుట్రపన్నిరని నేరము మోపబడెను. అనుచరులకుకూడా శిక్షవిధించబడినది.

### సంక్షేపంగా చరిత్ర

స్పెయినురాజు ౧౩వ అల్ఫాన్జోచనిపోయిని తర్వాత ౧౮౮౬ మే ౧౭వ తేదిన ఇప్పటి అల్ఫాన్జో జన్మించెను. ౧౯౦౨ మే ౧౭వతేదిని తన ౧౬వ ఏట స్పెయిన్‌రాజుగా ఇతనికిపట్టాభిషేకంజరిగెను. అప్పుడితనినిచంపుటకు జరిగినప్రయత్నాన్ని రహస్యపోలీసులుకనిపెట్టి విఫలముచేసిరి. ౧౯౦౪ జూన్ ౧౨వతేదిని ఒకపిచ్చివాడుఇతనిపై కాల్పుచేసెనుకాని దెబ్బతగులలేదు-౧౯౦౫ మే ౩౧వతేదిని పారిస్‌లో ఇతనిపైహత్యప్రయత్నముజరిగినది. ౧౯౦౬ మే ౩౧వతేదిన బాటెన్‌బెర్గు రాకుమారికుగు విక్టోరియా యూజీనాయాను వివాహమాడినప్పుడు ఇంకొక హత్యాప్రయత్నముజరిగినది. చర్చినుండి దంపతులు వచ్చుచుండగా ఒక బాంబువేయబడినది. ౨౪గురు ప్రేక్షకులు చనిపోయిరిగాని రాజదంపతులకు అపాయముకలుగలేదు. ౧౯౦౭ జూలై ౧౫వ తేదీని బార్సిలోనాలోను, ౧౯౧౧ జనవరి ౫వ తేదీని మాలాగాలోను వీరిపై బాంబులువేయబడినవి. ౧౯౧౩ ఏప్రిల్ ౧౩వతేదీని ఒక అరాజకవాది ఇతనిపై దివాల్వరుగాల్చెను.

౧౯౩౧ ఏప్రిల్‌లో రిపబ్లికను విప్లవంచెలరేగుచున్నపుడు ఆ లో ఫ న్ జో ప్రవాసానికి పోయెను. తర్వాతస్పెయిన్ పార్లమెంటు రాజరికాన్ని రద్దుచేసి రిపబ్లిక్‌ను ప్రకటించెను. అనాటినుండి అల్ఫాన్జో రోమ్‌లోనే నివసించుచుండెను. ౧౯౩౬-౩౯లో స్పెయిన్ అంతర్యుద్ధం జరిగినప్పటినుండి స్పెయినునిమంతో ఫ్రాంకోను ప్రోత్సహించి రాజరికం పునఃస్థాపనచేయవలెనని ప్రయత్నంజరిగినది. కాని ఫ్రాంకో అంగీకరించలేదు.

## బ్రిటనుకు అమెరికా సహాయచర్చ

“అరువుకౌలుబిల్లు”ను అమెరికాసెనెటుసభవారామోదించగానే, ఆదేశనగరాలలో ఆబిల్లును ప్రజాప్రతినిధిసభచేతకూడా వెంటనే అమోదింపచేయుటకు విశ్వప్రయత్నము జరుగుచున్నట్లుతెలియుచున్నది.

సెనెటర్ జార్జిగారు ఈప్రయత్నాలనుగురించి “జర్మనీ సరవేగముతో కదలుటకుసన్నాహముచేయుచున్నది. బాదాపుపదిరోజులలో అత్యద్భుతమైనమార్పులువచ్చునని నాకుతోచుచున్నది” అనిచెప్పెను.

పోయినయెన్నికలలో రిపబ్లికను పార్టీతరఫున అధ్యక్షపదవికి పోటీచేసిఓడిన విల్కీ గారి అభిప్రాయము, కొందరు ప్రతిఘటించి అందుకుబదులు బ్రిటనుకు ౨౦౦ కోట్లడాలర్లు ఋణమివ్వవలెనని ఫిబ్రవరి ౨౭వ తేదినాటి సెనేటుసమావేశంలో ప్రతిపాదించిరి. అదినను మూడుతరగతుల సెనేటర్లు ఆబిల్లునుప్రతిఘటించిరి.

హెన్రీవాలెస్ గారు అమెరికా సంయుక్తరాజ్యపు ఉపాధ్యక్షుడుగా మొదటిసారి ఉపన్యసించుచుఇట్లుచెప్పెను “నాజీలకు పరిపూర్ణవిజయంలభిస్తే మున్ముందు దక్షిణఅమెరికాలో నాజీఅధికారం స్థిరపడినతర్వాత అమెరికామీదకు వచ్చుటకు ప్రయత్నముజరుగును. యూరోపుఆఫ్రికాలను కలిపివేయుటజరుగును. దక్షిణఅమెరికాలో నాజీక్విస్లింగులు బయలుదేరి రాజకీయాధికారము తీసుకొనుటకుప్రయత్నింతురు నాజీలుచాకచక్యముతోకూడిన వర్తకపద్ధతులను అవలంబించి ప్రపంచములోని అన్నిదేశాల ఆర్థికవ్యవస్థను కూల్చుటకుయత్నింతురు. యుద్ధానికిపూర్వము మనకుండెవ్యాపారం హిట్లరు నిలవనిస్తాడో లేదో అనుమానమే అత్యావసరము అమెరికా ఎంతవేగంగా ఆయుధాలుతయారుచేస్తే హిట్లరుఅంతవేగంగా ఓడిపోవును” అనివారనిరి.

### ముసోలినీకోర్కెనుమార్షల్ పెటేయిను నిరాకరించుట

లిబియాలోవున్న ఇటాలియనుసైనికులను ట్యునీసియాద్వారా ఇటలీకిఇచ్చుటకు దారిఇవ్వవలసినదని ముసోలినీ మార్షల్ పెటేయిను ముసోలినీకోర్కెను నిరాకరించినట్లును తెలుస్తున్నది.

సంవత్సరము చందా
౬ పావలీ రూపాయిలు
ఆరునూసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥ చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

T· only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

**Volume 15** — **Hyderabad-Dn.** — **Monday 3rd March 1941** — **Number 83**


[ మొదటి పేజీ తరువాయి ]

ఆటుతర్వాత సౌమ్యవచనములను చెప్పుచున్నారట దీని అంతరార్థమేమిటో బోధపడుటలేదు. కొందరు మొదట జపానుదుడుకుతనము గాఆమాటలుచెప్పినాగాని తరువాత అమెరికా, బ్రిటను, ఆస్ట్రేలియాలు పసిఫిక్ ప్రాంతంలో రక్షణలను సన్నద్ధము చేసికొనుచుండుటవల్ల మెత్తబడెనని యు చెప్పుచున్నారు. ఫిబ్రవరి ౨౪వ తేదీనుదయ బ్రిటను ప్రధాననగరమగు లండనులోని జపాను ప్రభుత్వ రాయబారి బ్రిటిషుప్రధానియగు చర్చిలు గారితో సంభాషణలుజరిపిరి. ఇందువల్ల జపాను బ్రిటనులమధ్యనుండే అనేకములైన అపోహలు తొలగిపోగలవని లండనులో జపానీయప్రముఖులుచెప్పిరి. లండనులో బ్రిటిషుప్రభుత్వ విదేశాంగమంత్రియగు ఈడెనుగారితో అక్కడి జపాను రాయబారియు, జపాను ప్రధాననగరమగు టోకియోలో జపానుమంత్రులతో అక్కడి బ్రిటిషు రాయబారియు తూర్పుఆసియాలో రాజ్యముల పట్ల జపాను అవలంబించదలచు వైఖరినిగురించి సంభాషించిరట. జపాను సైనికాధికారులు జపానుప్రభుత్వ ప్రధానమంత్రి, విదేశాంగమంత్రి, హోమ్యాంగమంత్రి, యుద్ధమంత్రి, నౌకాశాఖ మంత్రులతోకలిసి జపాను పరిస్థితులనుగూర్చియు, అంతర్జాతీయపరిస్థితులను గూర్చియు ఫిబ్రవరి ౨౩వ తేదీనచర్చించిరి. ఫిబ్రవరి ౨౪వ తేదీన జపాను నౌకాశాఖసహాయ మంత్రియగు టోయాడాగారొకముఖ్యప్రకటనచేసినారు- "అమెరికావారు గూవాములోను, పసిఫిక్ సముద్రంలోని ఇతర ద్వీపాలలోను కోటలనిర్మాణమునకు, సైనికస్థావములఏర్పాటులకు ౨౦కోట్లడాలర్లకంటె ఎక్కువఖర్చుపెట్టుటలేదు. ఇంతమాత్రానికే జపాను భద్రతకు ఉపద్రవమేర్పడునని భయపడవలసిన అవసరములేదు- అమెరికావారి సన్నాహాలవల్లభయపడవలసినఅవసరములేనివిధమునజపాను యుద్ధనావలు తగిన జాగ్రత్తను గైకొనుచున్నవి." అని ప్రకటనలో తెలిపినారు. ఆస్ట్రేలియానుండియు, దాని చుట్టుప్రక్కల నుండియు తెల్లవారొక్కరైనను లేకుండచేసెదమని జపాను విదేశాంగమంత్రి ప్రకటించినాడనియు ఈ బెదరింపులకు ఆస్ట్రేలియాలోని తెల్లవారులొంగక తమహక్కులను కాపాడుకొనగలరనియు ఆస్ట్రేలియా రాజ్యపుతాత్కాలిక ప్రధాని ఫాడెన్ గారు ఫిబ్రవరి ౨౨వ తేదీనచెప్పినారు. ఆదేరోజు ఆస్ట్రేలియాలోని జపానురాయబారి "సింగపూరుకుతనసేనలనుపంపించుటను ఆస్ట్రేలియాకు హానిచేయునదికాని జపానుకుప్రతిఘటించు నద్దేశ్యముకో ఆస్ట్రేలియా సేనలనుపంపుట హాస్యాస్పదము" అని చెప్పిరి. ఈ సందర్భంగా జపానుచర్యలయెడ బ్రిటను అమెరికా, ఆస్ట్రేలియాలు విరోధముగలిగియుండుటనుచూచి జపానుదేశపు దినపత్రికలలో ప్రసిద్ధమైన 'టోంగుపో' అనుపత్రికయొక్క ౨౪వ తేదినాటిసంచికలో సంపాదకీయమందు బ్రిటను, అమెరికా, ఆస్ట్రేలియా, డచ్చివారిఈస్టిండీస్ రాజ్యములు నాలుగునుకలిసి జపానునుతూర్పుఆసియా దక్షిణభాగంలో విజృంభించకుండ అరికట్టినచో ఆనాలుగు రాజ్యములకును భద్రతఏర్పడుననియు, తూర్పుఆసియాదక్షిణప్రాంతమందు అమెరికావారిప్రవేశానకుఅప్పుడు జపానువల్లభయముండదనియు ప్రేరేపణచేయబడినది. ఇట్లుచేసినవారుఆనాలుగురాజ్యాలను జపానుపైకిఎగదరిమి తమ జపానుఒత్తిడిని సడలించుకొనుచున్నట్లు చేయజూచుచున్నారు. అదే పత్రికయందుఆనాలుగురాజ్యాల యుద్ధనౌకలుకు విదేశాలనుండిజపానుకు పెట్రోలుసరుకులు గానిరాకుండ దిగ్బంధనచేయవలెననికూడ సూచనచేయబడినది. జపానువిజృంభణవల్ల అమెరికా, బ్రిటనులవ్యాపారానికికలిగేనష్టానికి ఒకఉదాహరణమిపుడు క్రొత్తగా "హాంగ్ కాంగ్, షాంఘయి బ్యాంకింగ్ కార్పోరేషన్" అను సంస్థయొక్క అధ్యక్షుడగు పీటర్సన్ గారిచే బయటపెట్టబడినది. ఉత్తరచైనా జపానువారికి లోబడినతర్వాత అక్కడ జపానువారిప్రేరణచే రిజర్వుబ్యాంకు ఏర్పడినప్పటినుండి బ్రిటిషువారికిని అమెరికావారికిని నష్టముకలిగించువిధానమును ఆబ్యాంకు అనుసరించుచుండుటవల్ల జపానునుండి విదేశాలబ్యాంకు లేవియు లేకుండచేయుటయే జపానుతలపని స్ఫురించుచున్నదని పీటర్సను గారనిరి.

మొత్తముమీద జపానువారు తూర్పుఆసియా దక్షిణభాగంలో రాజ్యాలఆక్రమణకు యత్నించుచున్నట్లు జపానుప్రధాని జపాను శాసనసభయొక్క ప్రధానశాఖ సమావేశమందు ఫిబ్రవరి ౨౭వ తేదిన గావించినప్రకటనవల్ల స్పష్టమైనది. "స్వరక్షణకై జపాను యుద్ధసన్నద్ధమగుచున్నది. కాని అమెరికావారు తమనిజమైనఉద్దేశ్యమును తెలిపి, ఆదేశమును యుద్ధమునుండి మరలించుటకే సర్వవిధముల యత్నించుచున్నది. జపాను అనుసరించుచున్న సామ్రాజ్యసంపాదన విధానము చాలశ్రేష్ఠమైనది. ఇందులో జపానుఉద్దేశ్యము చాలగొప్పది. స్వార్థము ఎంతమాత్రము ఇందులోలేదు. యూరోపు ఖండములోని దేశములుకూడ ఇట్టిగొప్పసిద్ధాంతములనే అనుసరించునట్లు ప్రచారముచేయగలము. జపానుకు నియంతృపరిపాలనపద్ధతిలేదు. జపానుసామ్రాజ్యసంపాదనకు అద్భుతగులు రాజకీయోద్యమములను జపానుప్రభుత్వమువారు సహించరు." అని జపానుప్రధాని ప్రకటించినాడు.

జపాను తూర్పుఆసియాలోని దక్షిణదేశంమీదికి దాడివెడలినచో రష్యావారు నెమ్మదిగా వెనుకవైపునుండివచ్చి మంచూకోపైకి ఆక్రమించవచ్చునని భయంగలదు. అందుచేతనువారు జపానురష్యాలకు ఒక విధమైనసంధిని కుదుర్చుచున్నారు గాను చేయుచుండినట్లు ఇదివిరలోనినియున్నాము-ఇపుడుజపానురష్యాలకు ఒకఒడంబడిక కుదిరినట్లును, ఆఒడంబడికపత్రముపై సంతకము పెట్టుటకు జపానువిదేశాంగమంత్రియగు మత్సుఒకాగారు రష్యా.కుపోనున్నట్లును వార్తవచ్చినది- ఓడంబడిక షరతులు రష్యాకుఅనుకూలముగానున్నవట- ఈఒడంబడికప్రకారము మంచూకోసరిహద్దుకద్ద రష్యాసేనలు గానిఉండరాదు- మరియు ఈసరిహద్దుగీత రష్యాకుఅనుకూలముగా మార్చబడును, పూర్వపు "పోర్ట్సు మత్ ఒడంబడిక" అను దానిప్రకారం సఖలీను దీవియొక్క సంపదనుప యోగించుకొనుటకును, రష్యాకుసంబంధించిన సముద్ర భాగములో చేపలు పట్టుటకును, అధికారములుండ, ఇకమీద వర్తకపద్ధతిపై ఇట్లుచేయుటకు కొంతవీలుండునేగాని, అంతకు మించిఅధికారము లేకుండిపోవును.

---

## హైద్రాబాదు మునిసిపల్ సంఘము

---

హైదరాబాదు, ఫర్వరి ౨౮

పైసంఘానికిప్రభుత్వమువారు ౪౦ లక్షలఋణమునిచ్చినారు. దానినెట్లువినియోగించవలెను అనువిషయములో ఆలోచనలుచేసి సూచనలుచేయుటకు ఒక ఉపసంఘమేర్పడినది.

---





Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B. A B.L.